నోటీసు

అనంతపూర్ సబార్డినేట్ జడ్జి కోర్టులో ... Between ...

8-7-51.

## గంటల పంచాంగం

ఖర సం॥ ఆషాఢ శు॥ చవితి
1951 సం॥ జూలై 8 ఆదివారం
అ॥ చవితి రా 9-11 మఘ రా 2-42 వర్జ్యం ప 1-39 ల 3-23 కు.
శ॥ పంచమి జూలై 9 సోమవారం
సో॥ పంచమి రా 10-18 పూఫ తె 4-21 వర్జ్యం ప 11-16 ల 12-58 కు.




ఆంధ్రపత్రిక

ఖర సం॥ ఆషాఢ శు॥ చవితి
ఆదివారం


## రైల్వే కార్మికుల సమ్మె నిర్ణయము

ప్రధానమంత్రి విజ్ఞానవ మనుకూడ తిరస్కరించి ఆగస్టు 27 వ తేదీనుండి సమ్మెప్రారంభించుటకు రైల్వే కార్మిక ప్రతినిధులుచేసిన నిర్ణయము ...

## కాంగ్రెస్ కృషి: నెహ్రూ సమీక్ష

(1-వ పేజీ తరువాయి)

## సంజీవ రెడ్డిగారి రాజీనామా

ఉపసంహరించుకో వలసిందిగా విజ్ఞప్తి

ప్రదేశ్ కాంగ్రెస్ కార్యాలయం మూసి వేత

శ్రీ సంజీవరెడ్డిగారు రాజీనామా ఉపసంహరించుకొనే సూచన

## దేశ విభజన అనంతరం సమస్యలు

## కేంద్రరాష్ట్ర ప్రభుత్వాల నిర్మాణ కృషి

## ఇంకా నిర్వహించ వలసిన పనులు

## ఏ. ఐ. సి. సి. కర్తవ్యం

## హ్యూగ్ కోర్టు తీర్పు: పర్షియా వైఖరి

(1 వ పేజీ తరువాయి)

## పారుపల్లి రామ కృష్ణయ్యగారి మృతి

ప్రసిద్ధాంధ్ర గాయకుడు

విజయవాడ, జులై 7: గాయక సార్వభౌమ శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యగారు యీరోజు మధ్యాహ్నం 12 గంటలకు, హృద్రోగముచె ఆకస్మిక మరణము పొందినారని తెలుపుటకు చింతిస్తున్నాము.

నిన్నటినుంచి, రామకృష్ణయ్యగారు, ఆయనవద్ద శిక్షణపొందిన సుప్రసిద్ధులైన అనేకమంది శిష్యులూ తమ గురువుగారి 34 వ ఆరాధనోత్సవాలను జరుపుతున్నారు. ఇవాళ మధ్యాహ్నం రామకృష్ణయ్యగారు స్నానం చేయడానికి వెడుతుండగా, ఆకస్మికంగా గుండె నిలచిపోయింది.

వయస్సు 68 సంవత్సరాలు. వీరికి ఒకేఒక కుమార్తె భార్య ఉన్నారు.

### జీవిత సంగ్రహం

గాయక సార్వభౌమ త్యాగరాజ కళాపరిషత్ అధ్యక్షుడు, శ్రీ పారుపల్లి రామకృష్ణయ్యగారు స్వభాను సంవత్సర మార్గశిర బహుళపాడ్యమి శనివారంనాడు (1883 సం॥ డిశంబరు 5 వ తేదీ) ప్రాచీనాంధ్ర సామ్రాజ్య రాజధానిగా లోకవిఖ్యాతి గడించు కొన్న శ్రీకాకుళంలో జన్మించారు. వీరి జనకులు శేషాచలంగారు, తల్లి మంగమాంబగారు ఈదంపతులకు రామకృష్ణయ్యగారు రెండవకుమారులు శేషాచలంగారు గానకళావిశారదులు. పరమ భక్తులు, నిరంతరంభగవత్సంకీర్తనంతో జీవితాన్ని వెళ్ళదీసుకున్న మహా మహులు జీవితం చివరి భాగంలో ఆశ్రమంతీసుకుని శ్రీ శ్రీ ప్రద్యుమ్నానంద భారతిఅనేపేర ప్రసిద్ధులైనారు. ...

## "దేశాభ్యుదయానికి కృషిచేయడమే విద్యకుపరమావధికావాలి"

నిడుబ్రోలు కళాశాల ప్రారంభోత్సవంలో విద్యార్థులకు మంత్రి గోపాలరెడ్డిగారి హితవు

## ఆంధ్రవిశ్వవిద్యాలయం

బి. ఎస్. సి. (ఆనర్సు), ఎం. ఎస్. సి. పరీక్షా ఫలితాలు

వాల్తేరు, జూలై 4 : గత మార్చి-ఏప్రిల్‌లో జరిగిన బి. ఎస్. సి. (ఆనర్సు) ఎం. ఎస్. సి. డిగ్రీ పరీక్షలలో కొన్నింటి ఫలితాలు దిగువ ప్రకటిస్తున్నాము.

బి. ఎస్. సి. (ఆనర్సు) డిగ్రీ పరీక్ష

II వ భాగం ఫిజిక్స్ మెయిన్
1 వ తరగతి : 266 మాత్రం.
2 వ తరగతి : 260 61 67 69.
3 వ తరగతి : 263 68.
నెంబర్లు 262 265 వారి పరీక్షా ఫలితాలు తిరువాత ప్రకటింపబడగలవు.

ఎం. ఎస్. సి. డిగ్రీ పరీక్ష

ఎప్లయిడ్ ఫిజిక్స్-1 వ సంవత్సరం 457 టు 65.
జియోఫిజిక్స్-1 వ సంవత్సరం (1 వ బ్రాంచి-మెటిరియాలజీ, ఓషనోగ్రఫీ)
478 479 టు 84 87 478 విద్యార్థి జర్మనీలో తప్పిపోయాడు.
జర్మనీలో 486 మాత్రం పుత్తీర్ణులు.
2 వ బ్రాంచి ఫిజిక్స్ ఆఫ్ ది ఎర్తు 495 96 98 500 501.
జర్మనీలో 497 మాత్రం పుత్తీర్ణులు.

## మద్రాసు విశ్వవిద్యాలయం

ఎం. ఇడి., బి. ఏ. ఎస్‌సి. పరీక్షా ఫలితాలు

ఎం. ఇ డి. డిగ్రీ పరీక్ష

2. వ తరగతి : 3 10 12 20 21 24 టు 26 29 టు 31 35 42 45 48 50 టు 52 54 55 59 61 62 64 72 73.

## కమ్యూనిస్టు డిటెన్యూల కడపటి జట్టు విడుదల

## స్టాలిన్ 'కాంతి' బహుమానం.


























## గ్రంథసమీక్ష

పరమాణువు :-రచయిత శ్రీదువ్వూరి అనంత అచ్యుత సత్యనారాయణరావు. భౌతిక శాస్త్రోపన్యాసకుడు. ఆంధ్ర విశ్వవిద్యాలయము, వాల్తేరు. వెల 2-0-0 పరమాణువును గురించిన విజ్ఞాన శాస్త్రము అందరికీ అందు బాటులోనికి వచ్చురీతిగా రచయిత దీనిని సులభ శైలిలో వ్రాశారు. ఈ పుస్తకమునకు మద్రాసు విశ్వకళాపరిషత్తు బహుమతి లభించినది.

అసమర్థురాలి జీవయాత్ర :- రచయిత శ్రీ బి. ఎల్. దేశపాండే. ప్రతులకు దివోడరక్ న్యూస్ ఏజెన్సీ గవర్నరుపేట, విజయవాడ వెల 0-8-0

ప్రాథమిక పౌరశాస్త్రము :- రచయిత. శ్రీ గుమ్మిడిదల వెంకటసుబ్బారావు. గోష్ఠవిద్యాలయము విజయవాడ. వెల 1-4-0 ఇది ఆంధ్ర మెట్రిక్ సిలబసున కనుగుణ్యముగ జూనియర్ విద్యార్థుల కొరకు వ్రాయబడినటువంటి పుస్తకము. విద్యార్థులకు సులభ గ్రాహ్యమగు రీతిని సరళమగు శైలిలో నిది వ్రాయబడినది.

ఆంధ్రప్రతిభ :- రచన. శ్రీ రామడుగుల సుబ్బారావు. ప్రధానాంధ్రోపాధ్యాయుడు. స్థానికోన్నత పాఠశాల వేగేశ్వరపురం వెల 1-0-0 ఈ పుస్తకములో డా॥ పట్టాభిసీతారామయ్య, కట్టమంచలామలింగారెడ్డి, సర్వేపల్లి రాధాకృష్ణగారలకు సంబంధించిన జీవిత విషయములను సరళమగు శైలి లో వ్రాశారు.

ప్రపంచ మతములు :- శ్రీ నిరిక్ కల్యానందస్వామి. ప్రచురణ. జాతీయ. మందిరం 6-ఎ మోబ్రేస్ రోడ్డు. రాయపేట మద్రాసు వెల 1-8-0 ఇందులో ప్రపంచంలో గల ముఖ్యమైన పదిరెండు మతములను గూర్చి రచయిత సమగ్రంగా వివరించారు. పుస్తకము చివర ప్రపంచమతముల పట్టిక యివ్వబడినది.

విప్లవ వీరులు :-రచయిత. శ్రీ గద్దెలింగయ్య, ఆదర్శ గ్రంథమండలి. విజయవాడ వెల 3-0-0 భారత దేశ స్వాతంత్ర్య సమరంలో వేలకొలది తమ అసువులను సైతం త్యాగంచేసి అమరమూర్తులైనారు. అట్టివారిలో కర్తార్ సింగ్, భగవతీచరణ్, చంద్రశేఖర అజాద్ మున్నగు ఇరవై ఇద్దరిజీవిత విశేషాలు యీ పుస్తకంలో వివరించబడినవి.

పల్లెపిల్ల :— సాంఘిక నాటకం. రచన: శ్రీసీతంరాజు వెంకటేశ్వర రావు. ప్రతులకు ఆదర్శ గ్రంథమండలి విజయవాడ. వెల 1-8-0. ఈ నాటకమునకు తీసుకొనబడిన యితివృత్తం చక్కగా నున్నది. భాష, శైలి సరళముగా నున్నవి.

స్టేజ్ స్టార్సు :— హాస్యనాటిక. రచయిత శ్రీ బి. ఎన్. సూరి ప్రచురణ. నవీనాంధ్ర నాట్య కళాసమితి, సత్యనారాయణపురం విజయవాడ. వెల 4అ.

అడవినీడలు పెంచువారు :— రచయిత శ్రీ వెన్నెలకంటి రాఘవయ్య ఆంధ్రరాష్ట్ర ఆదిమజాతి సేవాసంఘం. నెల్లూరు. వెల 0-12-0. ఆదివాసులలో చెంచుతెగ ముఖ్యమైనది. వారిని గురించి యీ పుస్తకంలో రాఘవయ్య గారు సమగ్రంగా వ్రాశారు.

సకలార్థ సహకార సంఘములు ఎందుకు? :— సకలార్థ సహకార గ్రంథమాల ప్రథమ పుష్పం ఇది. అనేక సంవత్సరాలుగా ఆంధ్రదేశంలో సహకారోద్యమమునకై తమ శక్తిసామర్థ్యములను వినియోగించి కృషిచేయుచున్న శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు రచించిన ఉద్గ్రంథమిది. మన సహకారోద్యమము ను గూర్చి ఆంధ్రభాషయందు ఇదియొక ప్రమాణ గ్రంథముగా భావింపదగినది. పరిచయ వాక్యాలు శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు వ్రాసిరి. శ్రీ కళావెంకట్రావు గారు దీనికి భూమిక వ్రాసిరి. మామిడిపూడి వెంకటరంగయ్య గారు "ఆశీస్సులు" వ్రాసిరి. శ్రీ వేమవరపు రామదాసు పంతులుగారికిది అంకితమివ్వబడినది. ఇది సుమారు 500 పుటలుగల చక్కని క్వాలిటీలో బైండు గల పుస్తకము. వెల రూ. 8 లు. ప్రతులకు :- శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు, ఆలమూరు, తూ॥ గోదావరిజిల్లా అని వ్రాయవచ్చు.

హోమియోపతి ఔషధ మార్గదర్శక లక్షణములు :—గ్రంథకర్త. శ్రీ ఇ. బి. నాష్, అనువాదకుడు ప్రకాశకుడు వేమవరపు వెంకటరమణశర్మ, కొత్తపేట, తూర్పుగోదావరిజిల్లా. ప్రతులకు ప్రకాశకునకు వ్రాయవలెను, వెల. 10-0-0.

ఆర్య ప్రవర్తనము :— రచయిత పం. శ్రీ అన్నె కేశవార్యసిద్ధాంతి శాస్త్రి ప్రకాశకులు ఆర్య సమాజము గోషామహల్ హైద్రాబాద్ (దక్కన్) వెల 0-6-0. ఈ పుస్తకములో ఆర్యసిద్ధాంతములు సరళమగు పద్ధతిలో వ్రాయబడినవి. ఇది అందరును ముఖ్యముగా బాల బాలికలు చదువ దగినది.

తెలుగు పుస్తకాల వర్గీకరణము :— రచన. శ్రీ పాతూరి నాగభూషణం. ప్రకాశకులు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము. పటమటలంక (వయా) విజయవాడ వెల 0-5-0.

దిరైజ్ అండ్ సింగ్ :— అన్నతిరుత్తినిబోర్డు హైస్కూలు మాగజైను ప్రథమ సంచిక మా కార్యాలయము నకు చేరినది. ఇందులో ఆంగ్లములోను, ఆంధ్రములోను, తమిళములోను, విద్యార్థులు వ్రాసిన వ్యాసములు కథలు గలవు. రచయితలు విద్యార్థులైనప్పటికీ సంచిక సర్వాంగ సుందరముగా నున్నది.

## వారఫలాలు

జులై 8 వ తేదీ మొదలు
14 వ తేదీ వరకు
శ్రీ రావినూతల ఆంజనేయులు

### గ్రహస్థితి

రవి-కుజులు (మిథునం) బుధుడు (కటకం) గురువు (మీనం). శుక్ర (సింహం). శని (కన్య). రాహువు (కుంభం). చంద్రుడు (సింహ, కన్య తుల, వృశ్చికం.

### గ్రహరాశ్యంతర యోగములు

9 రవినెప్ట్యూన్, (కేంద్రం). 14బుధ రాహు (షడాష్టకం).

### మార్కెట్టు మార్పులు

వెండి - బంగారాలూ వాటాలూ 9 అభివృద్ధి 10 నిలకడ 11 మందం 12,13 14, 2 గం॥ వరకూ స్వల్ప అభివృద్ధి తర్వాత మందం.

### మీలగ్న (రాశి) ఫలాలు

**మేషం** (అశ్వని, భరణి, కృత్తిక 1 వపాదం)

ఈ వారంలో 9 ఆరోగ్య భంగం. ఆశాభంగం 10, 11, 12 ల్లో పరిష్కారాలూ, నూతనయత్నం 13, 14 ల్లో ప్రయాణం లాభించకలదు. ప్రథమంలో కొంత శ్రమకలిగినా ఆర్థిక పరిస్థితులను చక్కబరుచు కొనగలుగుతారు. ప్రతికక్షులవల్ల వత్తిడి తగ్గుతుంది. బంధువులవల్ల గౌరవం పొందికలుగుతారు. స్థలం మార్పులు అనుకూలంగా, లాభకరం యుంటవి. ఉద్యోగ నౌకరీల్లో అనుకూలత కలుగుతుంది. 11 శుభవార్త 14 ఆప్త సమాగమం.

**వృషభం** (కృత్తిక 2, 3, 4 రోహిణి, మృగశిర 1, 2 పాదాలు)

ఈ వారంలో మీ ఆరోగ్యం 12 వరకు యించుమించు గతవారంలోలాగే యుంటుంది. సంఘంలో మానం మేలు కలిగించకలదు. మీరు ఎంత జాగ్రత్తగాయున్నా మీకు తొందర కలిగించే వారుంటారు. ఏదో విధంగా కొంత ఎగతాళికి గురి కావచ్చు. 13, 14 ల్లో ఆస్తి మార్పులు అనుకూలంగా యుంటవి. ఆరోగ్యాభివృద్ధి కలుగుతుంది. పెట్టుబడులు లాభించకలవు. నూతన ఉద్యోగ సంపాదన ప్రయత్నాలు అనుకూలించే సూచనలున్నవి. సంఘంలో పలుకుబడి హెచ్చుతుంది. 11 ఆరోగ్య భంగం 14 లాభం శుభవార్త.

**మిథునం** (మృగశిర 3, 4, పాదాలు ఆర్ద్ర పునర్వసు 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో 9 విలాస వినోదాలతో సంఘంలో మిత్రులతో గడచిపోతుంది. ప్రయాణం పరిష్కారాలూ నూతనయత్నం లాభించకలవు. 10, 11 12 ల్లో ఉద్యోగ నౌకరీల్లో పైవారిని గమనించియుండడం అవసరం. ఎంత శ్రమపడినా తృప్తిని కలిగించలేరు. గృహాభివృద్ధి ప్రయత్నాలు అగుతవి. 13, 14 ల్లో ఎంతజాగ్రత్తగాయున్నా వాగ్వాదాల్లో ప్రవేశించడం కలుగుతుంది. ప్రతికక్షుల పోషకు గురి కావచ్చు. మొత్తంమీద కార్యక్రమం చాలా వెనుకబడే సూచనలున్నవి.

**కర్కాటకం** (పునర్వసు4, పుష్యమి, ఆశ్లేష)

ఈ వారంలో 9 కుటుంబంలో అనారోగ్యం. ఆర్థిక చిక్కులూ ఎటూ కదలనివ్వవు. 10, 11, 12 ల్లో సంఘంలో చిక్కులు నైపుణ్యంతో సడలించుకొన కలుగుతారు. ఉద్యోగ నౌకరీల్లో అనుకూలమార్పులు జరుగుతవి. వ్యాపారం లాభించకలదు. బంధుమిత్రుల ఆదరణా సహాయం ఏర్పడుతవి. ప్రయాణం పరిష్కారాలూ ముగించుకొనడం మంచిది. 13, 14 ల్లో ఆరోగ్యం తిన్నగాయుండదు. ఉద్యోగ వృత్తుల్లో శ్రమఅధికం ఫలంస్వల్పం

**సింహం** (మఖ, పుబ్బ, ఉత్తర 1 వ పాదం)

ఈ వారంలో 9 ఆప్తుని కలుస్తారు. 10,11,12 ల్లో వాతావరణం మీఆరోగ్యాన్ని తగ్గించకలదు. కంగ్లుమంటగా యుంటవి. సంఘంలో కలహాలు కలుగుతవి. కుటుంబ ఆర్థికపరిస్థితులు కూడా తృప్తికరంగా యుండవు. 13, 14 ల్లో వ్యాపార స్పెక్యులేషన్లు లాభించకలవు. ఆరోగ్యాభివృద్ధి కలుగుతుంది. ప్రయాణంపరిష్కారాలూ ముగించడం మంచిది.

**కన్య** (ఉత్తర 2, 3, 4 పాదాలు, హస్త చిత్త 1, 2 పాదాలు)

ఈ వారంలో 9 కోరగాని ఖర్చులు ఎక్కువ. 10, 11, 12 ల్లో మిత్రుల సలహా వ్యాపార స్పెక్యులేషన్లలో లాభకారి కాగలదు. సందేహాలతో కూడిన ప్రయాణం చేస్తారు. సంఘంలో అభిప్రాయ భేదాలు తొలగుతవి. 13, 14 ల్లో కుటుంబంలో అనారోగ్యం. స్వల్ప ఆర్థిక చిక్కులూ ఇరుగు పొరుగులో మనస్పర్థలూ కలిగే సూచనలున్నవి. 11 శుభవార్త 14 శ్రమ.

**తుల** (చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)

ఈ వారంలో మీ వృత్తి వుద్యమ పరిస్థితులు గత వారంలోకన్నా మేలుగాయుంటవి. ఆరోగ్యం 10, 11, 12 ల్లో కొంత తగ్గుతుంది. ఆహార విహారాల్లో నియమం అవసరం. 9 వ్యాపార స్పెక్యులేషన్లు లాభించకలవు. 10, 11 12 ల్లో స్పెక్యులేషన్ పెట్టుబడులూ ఆపండి. 13, 14 ల్లో రాజకీయాల్లో ప్రవేశంకలవారు సంఘబలాన్ని అభివృద్ధిపరచుకొన కలుగుతారు. బంధుమిత్రుల సహాయం సభల్లో శుభ పుణ్య కార్యాల్లో ప్రవేశం. సంతోషం పొందకలుగుతారు.

**వృశ్చికం** (విశాఖ 4 వ పాదం, అనూరాధ జ్యేష్ఠ)

ఈ వారంలో మీ వృత్తి వుద్యమ పరిస్థితులు 12 సాయంత్రం వరకూ తృప్తికరంగా యుంటవి. 9 చిన్న ప్రయాణం ప్రియ బంధు సమాగమం శుభ ప్రస్తాపనలూ ఉత్సాహాన్ని సంతోషాన్ని కలిగించకలవు. నూతన మిత్రుల చేరుతారు. 10, 11, 12 ల్లో పెట్టుబడులూ ఆస్తి అభివృద్ధి ప్రయత్నాలూ వ్యాపారం లాభకరంగా యుంటవి. ముఖ్యకార్యము 13, 14 ల్లో సాగదు. భార్యాబిడ్డలకు ఆరోగ్యం తగ్గుతుంది. 11 శుభవార్త.

**ధనుస్సు** (మూల పూర్వాషాఢ ఉత్తరాషాఢ 1 వ పాదం)

ఈ వారంలో 13 ఉదయంవరకూ మీ వృత్తి ఉద్యమ పరిస్థితులు ముందుకు సాగేదీ వెనుకకు జారేదుగా యుంటవి. స్పెక్యులేషను వదలండి. లేదా శ్రమకూ, నష్టానికీ లోనవుతారు. అందువల్ల ఆరోగ్యభంగం మనోవేదనా కలుగవచ్చు. 13, 14 ముఖ్య పరిష్కారాలకూ పెట్టుబడులకూ అనుకూలం. ఆర్థికంగా నిలువమణి పెరుగుతుంది. మొత్తంమీద కార్యక్రమంలో ముఖ్యభాగం ఆగేసూచన లున్నవి.

**మకరం** (ఉత్తరాషాఢ 2, 3, 4 పాదాలు శ్రవణం ధనిష్ఠ 1, 2 పాదాలు)

ప్రస్తుతం గ్రహవేధ మీకు అనుకూలంగా లేదనే చెప్పవచ్చు. పాత వ్యవహారాలు బయటపడి మనస్సును ఎక్కువగా కలచే సూచనలున్నవి. ప్రశాంతంకలిగి పరిస్థితులను సర్దుకొనడం అవసరం. 9 ప్రయాణం వినోదం సంతోషం కలిగించకలవు. 10, 11, 12 ల్లో ఆరోగ్యభంగం ఆశాభంగంఎక్కువ. అపనింద భరించవలసియుంటుంది. 13, 14 మిత్రసహాయం సంఘంలో గౌరవం పొందుతారు. 11 ఆశాభంగం శ్రమ 13 శుభవార్త.

**కుంభం** (ధనిష్ఠ 3, 4 పాదాలు, శతభిషం, పూర్వాభాద్ర 1,2,3 పాదాలు)

ఈ వారంలో అన్ని రంగాల్లో కూడా మీరు ఎంత మౌనంతో కాలం జరుపకలిగితే అంతమంచిది. 9 ఆరోగ్యం సరిగాయుండదు. శ్రమా బద్ధకం ఎక్కువగా యుంటవి. 10, 11, 12 ల్లో చేతికి డబ్బువస్తుందికానినిలువదు. పెట్టుబడులు వదలండి. మిత్రులు సంతోషం కలిగిస్తారు. 13, 14 ల్లో మనస్సు అకారణంగా ఆందోళనకు గురికావచ్చు. ఆలోచనలు తగ్గించుకొని విశ్రాంతిపొందడం అవసరం.

**మీనం** (పూర్వాభాద్ర 4 వపాదం, ఉత్తరాభాద్ర, రేవతి)

ఈ వారంలో 9 మీవృత్తి ఉద్యమ పరిస్థితుల్లో అనుకూలతను గమనిస్తారు. వ్యాపారాభివృద్ధి అవకాశాలు కలుగుతవి. పరిష్కారాలకూ వస్తు విక్రయానికిగ్గ హాఫ్ క్షేత్ర అభివృద్ధి ప్రయత్నాలు చేయడానికి అనుకూలం 10, 11, 12 ల్లో ఆటంకాలతో కూడిన ప్రయాణంచేస్తారు. శుభంగా లాభంగా ముగుస్తుంది. 13, 14 ల్లో స్పెక్యులేషన్ పేకాటలూ లాభకరం. 9 ఆశాభంగం. 11 ధనలాభం. 12 శుభవార్త.



వినోదావారి 'స్త్రీసాహసంలో' సూర్యప్రభ

## సినిమా

| | | |
|---|---|---|
| జనతా (పల్లావరం) | 'సంసారం' | తెలుగు |
| పారగన్, ప్రభాత్, లక్ష్మి. | (తమిళం) 'దేవకి' | |
| శ్రీకృష్ణ కాసినో | 'పాతాళభైరవి' | ,, |
| కపాలి | 'చంద్రలేఖ' | ,, |
| సన్ | 'ఒకరాత్రి' | ,, |
| సరస్వతి | 'సౌదామిని' | ,, |
| సెలెక్ట్ | 'బాబుల్' | (హిందీ) |
| వెల్లింగ్టన్ | 'బహురాని' | ,, |
| స్టార్ | 'భాయ్ జాన్' | ,, |
| మహారాణి | 'ఆరామ్' | ,, |
| రాజకుమారి, అశోక్ | 'దీదార్' | ,, |
| బ్రాడ్ వే, చిత్ర | 'నగీనా' | ,, |

New Elphinstone : Branded
New Globe : Cinderella
Roxy : Inspector General
Sagar : Flash Gardon
Kinema Central: Congo Bill













| | | ప్రదర్శింపబడుచున్న కేంద్రములు | | | | 6—7—51 | |
|---|---|---|---|---|---|---|---|
| లక్ష్మి | - విజయవాడ | పూర్ణా | - విజయనగరం | చాముండేశ్వరీ | - మైసూర్ | జ్యోతి | - బరంపురం |
| వినాయక్ | - నెల్లూరు | సినిమా మెజెస్టిక్ | - కాకినాడ | రఘువీర్ | - అనంతపురం | అతి త్వరలో | |
| స్వరాజ్ | - తెనాలి | చాంద్ | - కర్నూలు | చిత్రా | - సికింద్రాబాద్ | గౌరీశంకర్ | - గుడివాడ |
| న్యూసిటీ | - గుంటూరు | సాయిబాబా | - చిత్తూరు | సాగర్ | - హైదరాబాద్ | రౌనఖ్ | - కడప |
| జయహో | - రాజమండ్రి | ముబారక్ | - బళ్లారి | చౌదరీ | - వరంగల్ | గోపాలకృష్ణా | - చీరాల |
| గోపాలకృష్ణా | - ఏలూరు | సాగర్ | - బెంగుళూర్ | శ్యాంప్రసాద్ | - ఒంగోలు | ప్రభాత్ | - తాడేపల్లిగూడెం |
| వెల్‌కం | - భీమవరం | సూపర్ | - ,, | రామకృష్ణా | - అనకాపల్లి | లక్ష్మి | - హిందూపూర్ |
| పరమేశ్వరి | - అమలాపురం | శ్రీ | - ,, | రాజగోపాల్ | - రామచంద్రపురం | కృష్ణ కోర్ట్ | - టంగుటూరు |
| పూర్ణా | - విశాఖపట్నం | | | వేణుగోపాల్ | - పార్వతీపురం | రామకృష్ణా | - చికాకోల్ |

# మేడూరు హైస్కూలు ప్రారంభోత్సవం

## జిల్లాబోర్డు అధ్యక్షుని విజ్ఞప్తి

విజయవాడ, జులై 5: విద్యావ్యాప్తిపై శ్రద్ధకలవారు, భాగ్యవంతులు ముందుకు వచ్చి స్కూళ్ళ స్థాపనలో ధనసహాయం చేయాలని, అప్పుడే సంఘం అభివృద్ధి చెందగలదని కృష్ణా జిల్లాబోర్డు అధ్యక్షులు కాకాని వెంకటరత్నంగారు జులై 2 వ మేడూరులో శ్రీ యలమంచిలి వెంకటరత్నం బోర్డు హైస్కూలుకు ప్రారంభోత్సవం చేస్తూ విజ్ఞప్తిచేశారు. కొల్లిపర సూరయ్యగారు అధ్యక్షత వహించారు.

ఈ ప్రారంభోత్సవానికి చుట్టుపట్ల గ్రామాలనుంచి అనేకులు, స్థానిక పంచాయతీబోర్డు అధ్యక్షుడు గుళ్లపల్లి రెడ్డెయ్య, తాతినేని సంకటసుబ్బయ్య మంటాడ హైస్కూలు హెడ్‌మాస్టర్ టి. సుబ్బారావు, కంకిరంగయ్య గారలు వచ్చారు. స్కూలు భవనాన్ని తమ తండ్రిగారిపేర కట్టించుతున్న యలమంచిలి రామమోహనరావుగారి వితరణను అధ్యక్షులు కొనియాడారు. పేట బాపయ్యగారు ప్రసంగిస్తూ, ఈ సంవత్సరం బోర్డువారు 18 హైస్కూళ్లు పెడుతున్నారని జిల్లాలో మొత్తం 74 హైస్కూళ్లు ఇకనుంచి పనిచేస్తూ ఉంటాయని తెల్పారు. నూకల రామస్వామిగారి ప్రసంగానంతరం, మంగళగానంతో కార్యక్రమం ముగిసింది.

ఇంతవరకు పెనమలూరు, వీరవల్లి, వణ్ణివాయి, కొండూరు, రమణక్కపేట, మేడూరు గ్రామాలలో కాకాని వెంకటరత్నంగారు, అరుగొలను గ్రామంలో కాశీశ్వరరావుగారు కంభంపాడు, ధనుబంపెలలో పేటబాపయ్యగారు ఇంకా నడిగూడెం, చింతలపాడు, ఉయ్యూరు గ్రామాలలో హైస్కూళ్లు తెరిచారు. స్వ. వి.

# రాజమండ్రి క్షయ ఆస్పత్రి రజతోత్సవం

## శానిటోరియం సేవాప్రశంస

రాజమహేంద్రవరం, జులై 4: ఇచ్చటి విశ్రాంతిపురం ట్యూబర్క్యులోసిస్ (క్షయ) శానిటోరియం రజతోత్సవసభ మొన్నటి దినం శానిటోరియం ఆవరణలో శ్రీ. రామశాస్త్రిగారి అధ్యక్షతను జరిగినది. మద్రాసు ప్రభుత్వ మెడికల్ సర్వీస్ డైరెక్టరు శ్రీ. వాసుదేవరావు గారు సభకు ప్రారంభోత్సవం చేస్తూ శానిటోరియం నిర్వాహకుల సేవను ప్రశంసించారు. శానిటోరియం బోర్డు అధ్యక్షుడు డా॥ యం. యల్. జోలీవీర్ సభికులకు స్వాగతం చెప్పారు. శానిటోరియం మెడికల్ సూపరింటెండెంటు డాక్టర్ పి. కె. కోషీ నివేదిక సమర్పిస్తూ మద్రాసు ప్రభుత్వము దీనికొక భవనమునూ, కొంత గ్రాంటునూ యిచ్చి సహాయపడినదనీ, ఇంకా అనేకులు ధరన్ మిషన్ బోర్డులనుంచి (అమెరికాకు చెందినవి) వ్యక్తులవద్దనుంచీ కూడా విరాళములు వచ్చినవనీ వాటివల్ల తగిన భవనముల నిర్మాణము సాధ్యమైనదనీ తెలియజేశారు. తూర్పుగోదావరి జిల్లా బోర్డు, పురపాలక సంఘములు వార్షిక విరాళములిచ్చి యీ సంస్థకు చాలా తోడ్పడుతున్నవనీ రాజమండ్రి పురపాలక సంఘం శానిటోరియంలో మున్సిపల్ వార్డు నిర్మాణమునకు చాల ధన సహాయము చేసినదనీ కూడ కోషీగారు చెప్పారు. చాలకాలం శానిటోరియంలో పనిచేసి మరణించిన డాక్టర్ కోతిరాజ్, మొదటి మెడికల్ సూపరింటెండెంటు డాక్టర్ జాన్, శానిటోరియం బోర్డు సభ్యులు, యం. అప్పారావు (అడ్వకేటు) గార్లకు కోషీగారు తమ కృతజ్ఞత తెలిపారు. రివరెండ్ వి. యల్. గోపాల్, రివరెండ్ యస్. యల్. కోల్‌మన్ గారలు శానిటోరియం చేస్తున్న సేవను కొనియాడారు. వి. యస్. పాల్ నారాయణరావుగారి వందన సమర్పణతో కార్యక్రమము ముగిసినది. (స్వ. వి.)

# బళ్లారి జిల్లాకు కొత్త ఆరోగ్యాధికారి

రాజమహేంద్రవరం, జులై 4: స్థానిక మ్యునిసిపల్ హెల్త్ ఆఫీసరు డా॥ యం. నరసింహంగారు బళ్లారి జిల్లా హెల్త్ ఆఫీసరుగా నియమింపబడినారు. వారిస్థానే డా. సుబ్రహ్మణ్యంగారు యిచ్చటి హెల్త్ ఆఫీసరుగా నియమింపబడినారు. (స్వ. వి.)

# నెల్లూరులో విజ్ఞానప్రచార మండలి స్థాపన

నెల్లూరు, జులై 3: నిన్న పురమందిరంలో ప్రముఖులు కొందరు సమావేశమై విజ్ఞాన ప్రచారమండలి అనే సంస్థను స్థాపించారు. బొంబాయిగ్రాంట్ [illegible] వికి ప్రాధాన్యం నివ్వాలని [illegible] కొంత రామమూర్తి పంతులుగారు హైందవ విజ్ఞానాన్ని గూర్చి ప్రసంగించారు. వి. ఆర్. కాలేజి ప్రిన్సిపాలు కె. సచ్చిదానందంగారు సభకు అధ్యక్షత వహించారు. మండలి [illegible] [illegible] మండలి [illegible] డి. రామమూర్తిగారు వివరించారు. (స్వ. వి.)

# విజయవాడ రేడియో స్టేషన్ అభివృద్ధి

## దివాకర్‌గారికి శ్రోతల సంఘం తరఫున వినతి

విజయవాడ, జులై 4: రేడియో శ్రోతల సంఘం తరఫున శ్రీ వింజమూరి శ్రీనివాసాచారిగారు, మంత్రి ఆర్. ఆర్. దివాకర్ గారిని కలుసుకొని విజయవాడ రేడియో స్టేషన్‌ను అభివృద్ధి చేయటానికి కొన్ని సూచనలు చేస్తూ ఒక వినతి పత్రాన్ని అందజేశారు. అందులో, దూరాన నివసిస్తున్న ఆంధ్రులకు కూడా కార్యక్రమాలు వినబడేలాగున స్టేషన్ శక్తిని పది కిలోవాట్లశక్తికి పెంచాలని; ఉదయం మధ్యాహ్నం ప్రసారాలను లేకుండా చేయడంవల్ల ఆంధ్ర కళాసేవకు నష్టం కలుగుతున్నదని; ఆంధ్రులలో మరుగుపడి ఉన్న కళాభిజ్ఞతకు ప్రోత్సాహమివ్వాలని కోరారు.

రేడియో సలహాసంఘం తగు ప్రాతినిధ్యం గలదిగా లేదని, వివిధ ప్రాంతములలోని "రేడియో శ్రోతల" సంఘములకు ప్రాతినిధ్య మొసంగవలెనని, రేడియో స్టేషనులో ఒక "ఫిర్యాదులు-సలహాలు" పుస్తకమును వుంచవలెనని అచ్చటికి వచ్చే విద్వాంసులు కళావేత్తలు మొదలగువారు ఆ పుస్తకములో వ్రాసే అంశములను స్టేషనువారు గమనించవలెనని సూచించారు.

ఆంధ్ర దేశములోని వివిధ ప్రాంతములలోని ప్రతిభను ఎరిగి, క్రొత్తవారికి తగుశిక్షణ నేర్పాటుచేసి, సుప్రసిద్ధ కళావేత్తలుగా తయారు చేయవచ్చుననియు, 'ఆడిషను'లో సంతృప్తికరంగా లేదని తెలుపబడిన వారికి యే కారణం వల్ల సంతృప్తికరంగా లేదో తెలిపి, సంతృప్తికరంగా నుండుటకు కొన్ని సూచనలు చేసిన చాలా మంది తరువాతి ఆడిషన్లలో నైనను సంతృప్తికరంగా నుండుటకు వీలుండునని సూచించారు.

రేడియో ద్వారా ప్రసారం చేయబడుతున్న సమయ సూచన సంతృప్తికరంగా లేదని బ్రిటిషు పరిపాలకులు ప్రవేశపెట్టిన యీ సూచన దుఃఖరసము ప్రకటిస్తున్నదనీ దేశస్వాతంత్ర్యము లభించిన తరువాత దుఃఖరసము బోయి సంతోషము ప్రకటింపబడవలెనని సూచించగా యీ సూచన చాల శ్రద్ధగా పరిశీలించవలెనని దివాకర్ గారు చెప్పారు.

## దివాకర్ గారికి స్టేషన్ డైరెక్టర్ విందు

విజయవాడ, జులై 4: నేటి సాయంత్రం విజయవాడ రేడియో స్టేషన్ డైరెక్టర్ డా॥ ఎ. వీరభద్రరావుగారు, భారత ప్రభుత్వపు బ్రాడ్‌కాస్టింగు — సమాచార శాఖమంత్రి శ్రీ ఆర్. ఆర్. దివాకర్ గౌరవార్థం అల్పాహారవిందు చేశారు. నాజర్ దళంవారు పల్నాటి వీరచరితాన్ని బుర్రకథ చెప్పారు. శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, జిల్లా కలెక్టర్ పి. యం. నాయక్, పోలీసు సూపరింటెండెంట్ సి. జె. పి. పింటో, సూపరింటెండింగ్ ఇంజనీర్ వేపా కృష్ణమూర్తి, ఎలెక్ట్రికల్ సూపరింటెండింగ్ ఇంజనీర్ వి. పప్పు, పబ్లిక్ ప్రాసిక్యూటర్ కపిల చినవెంకటరావు, చైర్మన్ డా॥ చలపతిరావు, మ్యునిసిపల్ కమిషనర్ యం. ఎ. రహమాన్, పారెపల్లి రామకృష్ణయ్య, మంగళంపల్లి బాల మురళీకృష్ణ, పాటిబండ అప్పారావు, డి. వై. యస్. పి. నారాయణస్వామి, అయ్యదేవర బాలాత్రిపుర సుందరమ్మ, గారలు రేడియో స్టేషన్ ఉద్యోగులు ధర్మజ్ఞాని, పుల్లెల వెంకటేశ్వర్లు, ఆదంట సూర్యనారాయణమూర్తి, వెంకటేశ్వరన్ గారలు విందుకు హాజరయ్యారు.

## రేడియో కేంద్రాల నిర్వహణ విధానం

### దివాకర్ గారి వివరణ

విశాఖపట్టణం, జులై 6: "ప్రభుత్వ ఆర్థికపరిస్థితులు అనుకూలించిన వెంటనే భారతదేశంలోని అన్ని రేడియో ప్రసారకేంద్రాల శక్తిని 10 కి లోవాట్లకు పెంచగలము"ని కేంద్ర ప్రచారశాఖమంత్రి ఆర్. ఆర్. దివాకర్ గారు ఇక్కడ పత్రికా విలేఖరుల సమావేశంలో అన్నారు. ప్రసారశాఖను 'బి. బి. సి. బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్' (లండను) ప్రస్తుతం నడుస్తున్న ఫాయిలో నడిపించే విషయం, ఆ శాఖ స్వయం పోషకమైనప్పుడు తప్పక పరిశీలించగలదని కూడా దివాకర్ గారు సెల్విచ్చారు. బి. బి. సి. విషయంలో మాదిరిగానే, మన దేశంలో కూడా ఒక కోటి రేడియో సెట్లు పనిచేస్తున్నప్పుడు రేడియో శాఖను ఒక కార్పొరేషన్‌గా చేసి దీనిపై అజమాయిషీ హక్కు పోస్టుమాస్టరు-జనరల్ గారికి యీయటం జరుగుతుందని చెప్పారు.

సింహళం రేడియో మాదిరిగా మన దేశపు రేడియోల ద్వారా కూడా వాణిజ్యప్రకటనలు చేయవచ్చునా అని ఒకను వేసిన సూచనపై వ్యాఖ్యానిస్తూ, బి. బి. సి. లో వాణిజ్యప్రకటనలు చేసే అవకాశాన్ని ప్రవేశపెట్టనందువల్ల శ్రోతల అభిరుచికి భంగం వాటిల్లుతున్నదనే అభిప్రాయాన్ని బ్రిటిష్ పార్లమెంటు [illegible] అన్నారు. [illegible] వరకే అన్ని రేడియో కేంద్రాలు కృషి

# ఫిలిం నిర్మాతలకు దివాకర్ సూచన

## విజయవాడ ఫిలిండిస్ట్రిబ్యూటర్ల సన్మానసభలో బ్రాడ్‌కాస్టింగ్ శాఖామంత్రి ప్రసంగం

విజయవాడ, జులై 5: "ఫిలిం ఉత్పత్తిదారులు, భారతదేశపు పూర్వ నాగరికత సంస్కృతిని తెలిపేడాక్యుమెంటరీ చిత్రాలను తీసినట్లయితే ప్రభుత్వం చాలా సంతోషిస్తుంది. తగిన ప్రోత్సాహంకూడా ఇస్తుంది. విదేశాలలో మనదేశం తరఫున చేయాల్సిన ప్రచారానికి ఇవి అనంతంగా తోడ్పడుతవి" అని భారత ప్రభుత్వపు సమాచార - బ్రాడ్‌కాస్టింగు శాఖల మంత్రి దివాకర్ గారు నిన్న రాత్రి విజయవాడ ఫిలిం డిస్ట్రిబ్యూటర్లు ప్రదర్శకులు చేసిన సన్మానంలో అన్నారు.

దివాకర్ గారికి కామరాజు గారు పూలమాలవేశారు. డి. కృష్ణమూర్తి గారు సన్మానపత్రం చదివారు. మంత్రిగారి సమాధానం తర్వాత విందు జరిగింది. శ్రీయుతులు షేక్ గాలీబ్, డా॥ వీరభద్రరావు, కలెక్టర్ పి. ఎం. నాయక్, పోలీసు సూపరింటెండెంటు సి. జె. పి. పింటో స్థానిక డిస్ట్రిబ్యూటింగు కంపెనీల, ప్రదర్శన మందిరాల యజమానులు వచ్చారు.

దివాకర్ గారు తమ ప్రసంగంలో ఇలా చెప్పారు: విజయవాడలో దాదాపు 50 డిస్ట్రిబ్యూటింగు కంపెనీలు 9 సినిమామందిరాలు ఉన్నవని తెలుసుకోటం సంతోషంగా ఉంది. కాని ఇవి మనకు చాలవు. నేను ఫిలిం పరిశ్రమకు ఎంతో చేయదల్చుకున్నాను. చేయదలచినదంతా చేస్తే మీకు నాతో పని ఏముంటుంది గనక! అందుకనే నేను. ఇంకా ఇదే మంత్రిపదవిలో వుంటూ వుండాలని మీ సన్మానపత్రంలో ఆశించారు! మనదేశం పెద్దది. జనసంఖ్య పెరుగతోంది. మనకు కావలసిన్ని సినీమాలూ లేవు. సినిమాలకు వచ్చే జనమూ తక్కువే అని చెప్పవచ్చు. ఏమైనప్పటికీ చలనచిత్ర పరిశ్రమ భవిష్యత్తు మహత్తరమైనది. ఫిలిం పరిశ్రమకు, ప్రదర్శన మందిరాల నిర్మాణానికి అవసరమైన సామగ్రిలో పంముఖ్యమైన సంగతి. చలనచిత్రం ద్వారా దేశంలో ప్రతి వ్యక్తితో, ప్రతి మారుమూల వ్యక్తితోనూ విద్యావిషయకమైన సాంస్కృతికమైన సమాచార సంబంధమైన సంబంధం పెట్టుకోవచ్చు. పత్రికలు చదువుకున్నవారికి గాని ఉపయోగపడవు. రేడియోలు వాటిని కొనుక్కొనగలిగిన వారికే అందుబాటులో ఉంటాయి—లేక వాటిని వినే తీరిక ఉన్నవారికి ఉపయోగిస్తాయి. కాని ఎక్కడ తెరవేసి అయినా ఫిలిం చూపెట్టవచ్చు. కాని ప్రస్తుతం ఉత్పత్తి అవుతున్న చిత్రాల ధోరణి చూస్తే, కేవలం వినోదమే పరమావధిగా వీటిని తీస్తున్నట్లుంది. ఎప్పుడైనా అవి సాంస్కృతిక విషయాలను చూపెట్టున్నాయంటే, అదేదో పొరపాటున వచ్చిపడిన సుగుణమే అనాలి. చిత్రోత్పత్తిదార్లకు "సత్యం శివం సుందరం" అనే ఉత్కృష్ట లక్ష్యసాధనే పరమావధి కావాలి. విదేశాలలో అనేకులు భారత నాగరికత సంస్కృతి జీవనాన్ని గూర్చి తెలుసుకోవాలని వాంఛిస్తున్నారు. అట్టి అంశాలను తెలిపే చిత్రాలను, డాక్యుమెంటరీ చిత్రాలను ఉత్పత్తిదారులు తీయాలి. బహుశా అవి నక్కువ లాభాలను ఇవ్వకపోవచ్చు. పోనీ ఇతర చిత్రాలపై వచ్చే లాభాలను ఇట్టి సాంస్కృతిక చిత్రాలను అప్పుడప్పుడూ ఉత్పత్తిచేయటానికి కొంత వరకు వినియోగించటం అవసరం. ఇందులో మంచి చిత్రాలను ప్రభుత్వం కొంటుంది. ఈఏడు 12 డాక్యుమెంటరీ చిత్రాలను కొనాలని నిర్ణయించాం. చలనచిత్ర-విచారణ సంఘపు నివేదిక రెండుమూడు నెలల్లో బహిర్గతమవుతుంది. అందులో కొన్ని అంశాలను చట్టం చేయాల్సి వస్తుంది. ఈలోగా వాటిపై ప్రజాభిప్రాయాన్ని సేకరించటంకూడా అవసరం. అప్పుడే మీలో కొందరికి ఆ నివేదికలోని అంశాలు కొన్ని తెలిసినట్లుగా ఉంది! కాస్త ఓపిక పట్టండి.

శ్రీ దివాకర్ ఉదయం మెయిల్‌లో విజయనగరం వెళ్లారు (స్వ. వి.)

# ఆంధ్రరాష్ట్ర సినిమా ప్రేక్షకులకు దివాకర్‌గారి సలహాలు

5 వ తేది సాయంకాలం విజయనగరంలో ఆంధ్ర రాష్ట్ర సినిమా సంఘ సమావేశాన్ని ప్రారంభిస్తూ దివాకర్ గారు, దేశం సినిమా పరిశ్రమ ఎవరూ అలక్ష్యం చేయటానికి వీలులేనంతగా అభివృద్ధి పొంది వున్నదని అన్నారు. సినిమా పరిశ్రమ ప్రేక్షకుల కొరకే ఏర్పడింది. కాబట్టి, ప్రేక్షకులు యీ విధమైన సంఘంగా ఏర్పడినందుకు తమ హర్షాన్ని వెలిబుచ్చారు. సినిమాలు చూచేవారి హక్కుల కోసం పోరాడటంతోనే తృప్తిపడక, యీ సంఘంవారు సినిమా పరిశ్రమకు సంబంధించిన పరిశోధనలు జరుపగల సంస్థగా తయారు కావాలని ఆశించారు. దాదాపు 70-80 కోట్ల మంది చూచి ఆనందించే యీ చిత్రాలను సాంకేతికాల విషయంలోను, కళాపరంగాను అభివృద్ధి పొందేట్లు చేసే అవకాశం

చేస్తున్నారనీ, ప్రభుత్వం ఈ కార్యక్రమాలను అభివృద్ధి చేయాలనీ కోరారు.

దివాకర్ గారు [illegible] స్థానిక ప్రతినిధి వి. ఎస్. వరకన వాలాగారి యింట బసచేశారు.

ఈ ప్రేక్షక సంఘాలకు వుంటుందని చెప్పారు. ప్రపంచ దేశాలలో సినిమా పరిశ్రమ విషయంలో భారతదేశం 2 వ స్థానం పొంది వుందనీ, ఆ కారణంగా ప్రేక్షక సంఘాల నిర్మాణాత్మకమైన విమర్శలు చేసి పరిశ్రమను సర్వతోముఖంగా అభివృద్ధి పరచమని హెచ్చరించారు. ఫిల్ము నిర్మాతలు కూడా యీ సంఘాలను, వారు వెలిబుచ్చే అభిప్రాయాలను మన్నించవలసి వుంటుందని అన్నారు. సంఘంలో విషయాలోలత్వాన్ని, నకిలితనాన్ని ప్రజా [illegible] [illegible] ప్రభుత్వం ప్రజల పరంగా నిలచి వారికి కావలసిన సహాయంచేయ సర్వదా సన్నద్ధమే నన్నారు. (స్వ.వి.)

# వన మహోత్సవాలు

మదరాసు, జులై 6: వ్యవసాయ మంత్రి శ్రీ ఎ. బి. శెట్టిగారు నిన్న సాయంత్రం మాంబలంరోడ్డులోని హార్టికల్చరల్ తోటయందు వన మహోత్సవం జరిపి వృక్షముల ప్రాముఖ్యత ప్రయోజనములను వివరించారు. మదరాసు కలెక్టరు వ్యవసాయ డైరెక్టరు మొదలగువారు హాజరైనారు.

మంత్రి పరమేశ్వరన్‌గారు పూనమల్లి హైరోడ్డులో స్త్రీహూపాఠ్యాల వందు వనమహోత్సవం జరుపుతూ స్త్రీలు శ్రద్ధతో యీ కార్యమును జయప్రదముగా నిర్వహింపవచ్చునని పలికారు.

వనమహోత్సవ వారంలో ప్రతివారు కనీసం రెండుమొక్కలైనా నాటవలెనని కార్పొరేషను కమిషనరు శ్రీ నరసింహంగారు విన్నవించారు.

## నెల్లూరు

ఈ 5 వుదయాన జిల్లాకలెక్టరు కార్యాలయ ఆవరణలో కలెక్టరు బి. జోగప్పగారి అధ్యక్షతను వనమహోత్సవం జరిగింది. బి. జోగప్ప, కలెక్టరు కార్యదర్శి ఆర్. ఎస్. ప్రకాశరావు, ఫారెస్టుఆఫీసరు, అన్నపూర్ణమ్మ, వి. సి. సుబ్బారెడ్డి, తహశీల్దార్ నారాయణరావు, జిల్లాబోర్డు అధ్యక్షుడు బెంచు దామానాయుడుగార్లు తదితరులు కానుగ, సపోటా మొదలైన మొక్కలను నాటారు. బీదరైతులకు నిమ్మ, సపోటా, మామిడి మొక్కలను కలెక్టరుగారు పంచిపెట్టారు.

## గుడివాడ

స్థానిక మునిసిపల్ కమిషనరు జె. మోహనరావుగారి ఆధ్వర్యాన ఈ 1 న వనమహోత్సవం జరిగింది. మునిసిపల్ ఆఫీసు ఆవరణలోను, వూరిలోని వివిధ ప్రాంతాలందునూ 800 ల మొక్కలు నాటారు.

## జగ్గయ్యపేట

స్థానిక డిప్యూటీ తహశీల్దారుగారు ఇక్కడ యీ 1 నుంచి 7 వరకు వన మహోత్సవ కార్యక్రమం ఏర్పాటు చేశారు. స్కూళ్ల డిప్యూటీ ఇన్‌స్పెక్టరు భావనారాయణగారు చెట్లు నాటినందువల్ల కలుగగల మంచిని గూర్చి చెప్పారు. జి. నాగేశ్వరరావుగారు తమ తోటలో విందు ఏర్పాటు చేశారు.

# గుంటూరుజిల్లాలో అధికాహారోత్పత్తి కార్యక్రమం

గుంటూరు, జులై 2: ఈ జిల్లా అధికాహారోత్పత్తి సంఘ సమావేశం మొన్న జిల్లాకలెక్టరు వైద్యనాథన్ గారి అధ్యక్షతను జరిగింది. 'స్టాటిస్టికల్ అసిస్టెంటు' ఎం. సత్యనారాయణగారు అధికాహారోత్పత్తి కార్యక్రమ వివరాలు తెలిపారు. 1949-52 లలో పబ్లిక్ వర్కు్సశాఖ ప్రణాళిక ప్రకారం 20 యిరిగేషన్ పనులు అమలుజరుగవలసి వుండగా భవనాశి చెరువు, పంతనూపులూరు చెరువుల మరమ్మతు, అరవపల్లి కాలువ, కొనూరు ఆనకట్ట- మొదలైన 5 స్కీములు మాత్రం పూర్తి అయినవి; వీటి మూలంగా 1331 ఎకరాలభూమి సాగై, 430 టన్నుల ఆహారధాన్యాలు పండగలవు. కర్లపాలెం 'సైఫన్', పెదకండ్లూరు ప్రాజెక్టు, భృగుబండ చెరువు, పెదగంజాం బ్లాకు, కొల్లిపర బ్లాకు, మోర్జోటు పట్టుకాలువ, పాదపల్లి-అల్లూరు బ్లాకులు మొదలైన 9 స్కీములు యించుమించుగా పూర్తిఅయినట్లే. వీటివలన 12,899 ఎకరాలు సాగులోనికివచ్చి, 5,697 టన్నుల అదనపు పంట లభించగలదు. మాచవరం చెరువు పులికుంట వాగు, ఆత్మకూరు చెరువు, గుంటకోల్ బ్లాకు మొదలైన స్కీముల తాలూకు అంచనాలు తయారై, ప్రభుత్వమంజూరుకు పంపియున్నారు. మొత్తం 1804 బావులు త్రవ్వారు; 652 ఎకరాలు సాగై 362 టన్నుల అదనపు పంటరాగలదు. ఇంకా 810 బావుల త్రవ్వకం చురుకుగా జరుగుతున్నది. వినుకొండ తాలూకాలో పిచ్చికలపాలెం, నల్లకుంట, మురుకమల్లి చెరువులు పూర్తికావచ్చినవి. బాపట్ల కళాశాల అధికారివద్ద సిద్ధంగావున్న 14 ట్రాక్టర్లను వినియోగించి గత ఏప్రిల్ 1 వరకు 945 ఎకరాలలో సేద్యంచేశారు. వారివద్దవున్న 8 ఆయిల్ ఇంజన్ సెట్లను కూడా వినియోగించారు. రైతులకు 103 ఎలక్ట్రిక్ పంపుసెట్టులు సరఫరా చేశారు. భూములులేని రైతులకు రేపల్లె తాలూకాలో పోడుమెరక, అడవులదివి గ్రామాలలో 1000 ఎకరాల వరకు భూములు మంజూరు చేశారు. గనపరం భూమికాలనీ సంఘానికి 227 ఎకరా భూమి ముక్తాకు యిచ్చారు. గత ఏప్రిల్ 1 నుంచి 991 టన్నుల ధాన్యపు విత్తనాలు, 19 టన్నుల యితర ఆహార ధాన్యాల విత్తనాలు పంచారు. వ్యవసాయ అభివృద్ధికి కొందరు ప్రచారకులను నియమించారు. (స్వ. వి.)

# ఆహార సమస్యా పరిష్కారం

## సలహా సంఘంలో పలు సూచనలు

మదరాసు, జులై 6: రాష్ట్ర ఆహార సలహా సంఘం నిన్న, మొన్న ముఖ్యమంత్రి అధ్యక్షతక్రింద సమావేశమైంది. రాష్ట్ర ఆహార మంత్రి వ్యవసాయ మంత్రి పబ్లిక్ వర్క్సు మంత్రి ఆహార వ్యవసాయశాఖ కార్యదర్శి సివిల్ సప్లయిల కమిషనర్ వ్యవసాయ డైరెక్టరు మొదలగు ఉద్యోగులు హాజరయ్యారు.

సభను ప్రారంభిస్తూ ముఖ్యమంత్రి ఆహార పరిస్థితి సమీక్షించి సభ్యులను సూచనలివ్వవలసిందని కోరారు.

చర్చలో సభ్యులలో నొకరుమిగులు జిల్లాలలో సేకరణకు జోనల్ పద్ధతి సరిగా పనిచెయుట లేదని, కోతలు అయిన వెంటనే జాగు ఏమీ లేకుండా సేకరణప్రారంభించాలనిసూచించారు.

మరొక సభ్యుడు రేషనింగ్ ప్రాంతంలో గోధుమలు ఇవ్వవలెననీ, జీవనవ్యయం పెరిగినందున వుత్పత్తిదార్లు వుంచుకో తగినప్రమాణమును హెచ్చించవలెననీ, సేకరణ ధరలను పెంచే విషయమై ప్రభుత్వమువారు శ్రద్ధ వహించాలనీ సూచించారు.

వ్యవసాయ పరికరాలు సరిగా సప్లయి అవటంలేదని, ఒక సభ్యుడు ఆక్షేపించగా ఉక్కు, ఇనుము తగినంత దొరకనందున చిక్కు వచ్చిందనియు, కాని నెలరోజుల్లో పరిస్థితి బాగుపడుతుందని వ్యవసాయ డైరెక్టరు చెప్పారు.

ఒక సభ్యుడు చెట్లు నరకకుండా చూడాలని లేనిచో వనమహోత్సవ ప్రయోజనం వుండదన్నారు.

వుత్పత్తిదార్లనుండి నేరుగా లేవనులు ఖరీదు చేయుటకు అంగీకరించాలని ఒకరన్నారు.

విశాఖపట్నం జిల్లాలో 482 చౌకధర దుకాణముల ద్వారా లేవనులు జారీ అవుతున్నాయని సివిల్ సప్లయిల డైరెక్టరు తెలియజేశారు.

కంట్రోలుధర కన్న 25% ధర ఎక్కువగాయున్న చోట వెంటనే చౌకధర దుకాణములను ఏర్పాటు చేయాలని మరొక సభ్యుడు సూచించారు. ఆదేసభ్యుడు జిల్లా గ్రామ ఆహార కమిటీలను పునరుద్ధరించాలన్నారు.

రెండవరోజున సమావేశానికి ఆహార మంత్రి అధ్యక్షత వహించారు. పట్టణ, పల్లెల ప్రజలకు సమానంగా బియ్యం సప్లయి చేయాలని ఒకరన్నారు.

ఒకసభ్యుడు రేషన్ ఏరియాలలో రేషన్ ప్రమాణమును తగ్గించి రేషన్ లేనిచోట్ల ప్రమాణం పెంచాలన్నారు. ఆహారధాన్యములను సేల్సుటాక్సునుండి మినహాయించాలన్నారు.

సమావేశం అఖరులో ఆహార కార్యదర్శి క్రితము దినము సభ్యులు చేసిన సూచనలకు జవాబు ఇస్తూ కోతలు అయిన వెంటనే సేకరణ ప్రారంభించుటకు వీలు లేదని, ఇందుకు డబ్బు, వాగనుల చిక్కులు వుంటాయన్నారు. కోతలకు సేకరణకు మధ్య కొంత వ్యవధి వుండి తీరుతుందన్నారు.

జోనల్ స్కీము గురించి ప్రభుత్వమువారు పరిశీలించుచున్నారనీ, అప్పుడే ఈ పద్ధతి విపులమొందనుటకు వీలులేదని కార్యదర్శి చెప్పారు.

రేషన్ ప్రాంతంలోని వుత్పత్తిదార్లు కానివారిని కూడా ఇతరుల ద్వారా బియ్యం తెచ్చుకోనిచ్చుట గురించి ప్రభుత్వంవారు పరిశీలిస్తూ వున్నారని వారన్నారు. వుత్పత్తిదార్లు వుంచుకోతగిన ప్రమాణం విషయమై కూడా ప్రభుత్వం ఆలోచిస్తోందని ఆహార కార్యదర్శి అన్నారు.

ఆహార ధాన్యముల ధర పెంచే విషయము ఇండియా ప్రభుత్వము వారిదేననియు వాడకందార్ల విషయం కూడా ఆలోచించవలసి వుంటుందని కార్యదర్శి చెప్పారు.

ప్రజలకు బియ్యం సమానంగా ఇవ్వాలనే విషయాన్ని ప్రభుత్వం వారు గమనిస్తారని చెప్పారు.

# ఉరవకొండకు విద్యుత్ సరఫరా

ఉరవకొండ: జులై 5: ఈపంచాయతీబోర్డు అధ్యక్షుడు సంజీవనారాయణప్పగారు యీ 2 వ మంత్రి భక్తవత్సలంగారిని కలుసుకొని పురవకొండకు గుంతకల్లునుంచి కొనకొండ్ల, వజ్రకరూరు, రాగులపాడు గ్రామాల మీదుగా విద్యుత్ సరఫరా చేయించవలసిందిగా కోరారు. చీఫ్ ఇంజనీరు ద్వారా అట్టిస్కీము ప్రభుత్వం అవగాహనకి రాగానే, మంజూరు చేయగలమని మంత్రిగారు అన్నారు.

# లారీక్రిందపడిన స్త్రీమృతి

ఆసిఫాబాద్, జులై 3: ఈ సాయంత్రము 5-30 గంటలకు బూర్గుడాగ్రామ కాపురస్థురాలు అమ్మక్క అనుఆమె, ప్రమాదవశాత్తు ఒక పోలీసులారీక్రింద పడి తీవ్రంగా గాయపడింది. చికిత్సకై ఆస్పత్రిలో చేర్చగా అక్కడ ఆమె మరణించింది. (స్వ. వి.)

# కీ. శే. మద్దూరి నాగభూషణరావు గారు

రాజమండ్రి, జులై 3: గత 15 ఏండ్లుగా రోగిగా జీవిస్తూ తమవద్దకు వచ్చిన రోగులకు వుచితంగా మందులిస్తూవున్న మద్దూరి నాగభూషణం గారు (60) ఈ 1 న యిక్కడ పరమపదించారు. 30 ఏండ్లపాటు వీరు ఉపాధ్యాయులుగా పనిచేశారు. వీరికి ముగ్గురు కుమారులు; ఒక కుమార్తె.

# నెహ్రూగారి నాయకత్వం

## దివాకర్‌గారి ప్రశంస

విజయవాడ, జులై 6: కేంద్ర ప్రచారశాఖ మంత్రి ఆర్. ఆర్. దివాకర్ గారు నిన్న యిక్కడ ఫిల్మ్‌డిస్ట్రిబ్యూటర్లు—ఎగ్జిబిటార్ల సమావేశంలో ప్రసంగిస్తూ నెహ్రూగారి నాయకత్వాన్ని కొనియాడారు. నెహ్రూగారికి సహజంగావున్న దూరదృష్టిని గురించి చెపుతూ, కొరియాలో మిత్రరాజ్యాలవారు 38 వ అక్షాంశరేఖను అధిగమించటం చైనావారిని రెచ్చగొట్టినట్లే కాగలదని ఆనాడు నెహ్రూ చేసిన హెచ్చరికను వుదాహరణగా పేర్కొన్నారు. వారు చేసిన యీ సూచనను అప్పుడు నిరసించిన అమెరికన్లు యీనాడు యీ ప్రాతిపదికపైనే యుద్ధవిరమణకు సంప్రదింపులు సాగిస్తూన్నందువల్ల నెహ్రూ పండితునకు ఎంతటి మేధాసంపత్తి వున్నదీ వ్యక్తం కాగలదని అన్నారు.

జగ్గయ్యపేట, జులై 4: హరిజనవాడలో గత ఆదివారం వుదయం 3 యిండ్లు అగ్నికి ఆహుతి అయినవి. రు. 1600/- ఆస్తినష్టమైనట్లు అంచనా వేశారు. (స్వ. వి.)

